# శుక్ల

శ్రీలేఖ సాహితి    కవితా సంకలనం.

సంపాదకుడు : టి. శ్రీరంగస్వామి




Estd. 1977

# శిక్ష(ం)

(కవితా సంకలనం)


సంపాదకత్వం..

టి. శ్రీరంగస్వామి

యం.ఏ., (పి.హెచ్.డి)



శ్రీలేఖ సాహితి

481

5-11-114/4 విద్యారణ్యపురి

వరంగల్లు-506009

"శుక్ల" ఉగాది (8-4-1989)
ప్రచురణ : శ్రీలేఖ సాహితి పదవ పుస్తకం
హక్కులు : సంస్థవి
వెల : అయిదు రూపాయలు
ముద్రణ : నటరాజ్ ప్రింటర్స్, వరంగల్లు

సాహితీ సేవలో
నిరంతరం శ్రమిస్తూ-
వృద్ధాప్యమును గణనకు రానీయకుండా
సాహిత్య పరంగా...
స్వర్ణోత్సవం జరుపుకుంటున్న
మా ఆత్మీయులు-

# శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి

ఈ చిరుపొత్తము
కానుకగా......

## శ్రీలేఖ సాహితి
వరంగల్లు

# మా మానసం

కాలచక్రం ఎవరి కొరకు ఆగదు. నిరంతరం భ్రమిస్తూనే ఉంటుంది. మా సంస్థ వెలువరించిన "ప్రభవ" సంకలనానికి, కవితను అందించిన ఆత్మీయులు డా॥ దాశరథిగారు ఈనాడు లేరు.

ఈ సంకలనంలోని కవులందరూ ఉదీయమానులు. ఆయా కలాల ప్రతిభాపాటవాలకు ఇందులోని కవితలు మచ్చుతునకలు మాత్రమే. కొంత మంది కవులు సాధనలో ఉన్నప్పటికిని వారిలోని జిజ్ఞాసను, సృజనాత్మకతకు ప్రోది కల్పించాలనేది మా ముఖ్యధ్యేయం ఆ ధ్యేయంలో భాగంగా వెలువడినదే ఈ కవితా సంకలనం. ఇందులోని రచయితలు జీవితాన్ని ఇంకా అధ్యయనం చేయ్యాల్సి ఉంది అని అనుకున్నప్పటికిని, పరిశీలనాత్మకతో ముందుకు సాగి వారి కలం నుండి అత్యుత్తమ కవిత్వం వస్తుందని ఆశించడం అత్యాశ కాదనే మా నమ్మకం. నిప్పుతో కాలిస్తే బంగారానికి మరింత వన్నె వచ్చినట్లుగా విమర్శ వల్లనే సత్కవిత వస్తుంది. అయితే ఆ విమర్శ సద్విమర్శ కావాలి.

మా మలి ప్రయత్నానికి వెన్నుతట్టి అండగా నిలిచిన సాహితీ మిత్రుల ఔదార్యానికి కృతజ్ఞతలు. సాహితీ మిత్రుల సమైక్య భావ స్ఫూర్తికి ఇది మధుర స్మృతి. మా సాహితీ పయనంలో తమవంతు సహాయ సహకారాలను అందించగలరనే నమ్మకంతో....

"ఆలోచనకు రూపం ఇవ్వటంలో ఎంత కష్టముందో, కృషికి కార్యరూపం ఇవ్వటంలో అంతకన్న ఎక్కువ కష్టం ఉంటుంది" అనేది మీ అందరికి తెలిసిందే.

స్నేహం నీడనిచ్చే చెట్టు లాంటిదనే.... భావనతో....

యస్. శ్రీనివాసస్వామి
అధ్యక్షులు

టి. శ్రీరంగస్వామి
కార్యనిర్వాహకులు

# అక్షరం – నా ఆయుధం!

– భువనగిరి నాగరాజు

ఆవేదనల నీలి మొయిళ్ళను
గుండెల ఎడారుల్లో కట్టేసి–
ఆవేశాల ఆరని చిచ్చులను
నేత్రాల పంజరాలలో బంధించి–
రగిలే సూర్యుళ్ళను పానీయంలా తాగి
ఈ చీకట్ల నరకం లోనికి
వెన్నెల వాకనై కురవాలనుకొనే వాణ్ణి!
నన్నిలా నడచిపోనివ్వండి!
రేపు – నా అక్షరాలు –
మంటల్లో తడిసిన మంత్రాలై
ఆవేశంతో ఎగిసిన చైతన్య కేతనాలై
శిశిరం ముసురుకున్న గుండెల తోటల్లోకి
వాడిపోని వసంతాల్ని ఆహ్వానిస్తాయి!
నిద్రిస్తున్న మొగ్గల గొంతుకల్ని శృతిచేసి
పరిమళాల పాటల్ని పాడిస్తాయి!
దైన్యాల ముసుగుల్లో – దోపిడీల సంకెళ్ళలో
కలల కౌగిళ్ళలో ముడుచుకు పడుకున్న
ఉక్కు పిడికిళ్ళకు ప్రాణవాయువులూది–
ఆరిపోని అగ్నులుగా మండిస్తాయి!
అంబరమంతా శాంతికపోతాల్ని ఎగరేస్తాయి!

ఇం. నెం. 6–3–182/ఎ, మంచాల వీధి, తిరుపతి–517507

# గుండె మంటలు

– యల్. వేణుగోపాలరావు

కన్నీటిధారల వెనక
　　　　కథలెన్నో తెలుసుకో
సంఘర్షణపరంపరల వెనక
　　　　చేదుగతం తెలుసుకో
మనసిచ్చివింటే నీకు
　　　　మనస్సు బాధ తెలుస్తుంది
కళ్ళు విప్పిచూస్తే నీకు
　　　　గుండె మంట కనిపిస్తుంది

# వసంతరాణి

– "రాధిక"

నూతన వత్సరపు, వసంత రాణీ,
లే మామిడి చివురుల
దాగి కూసే కోయిల,
నోట పలికే పాటకు బాణీ,
కవుల కంఠంతో పలికించి
చెవుల కింపును కలిగించే
కవితా సామ్రాజ్యపు, వాణీ
చూడమ్మా, పగబట్టి ఆకాశానికి
ఎగస్తున్నాయి, ధరలు విపణీ
కత్తులను దూస్తూ
కుత్తుకలను కోస్తూ
క్రూరత్వపు విత్తనాలు సమాజంలో అవుతున్నాయి పంపిణీ,
ఓః శుక్లా.... నీ ఆగమనం ఈ ఉగాదిని
కావాలి, రాక్షసత్వాన్ని కాటువేసే ఫణి
దుష్టత్వాన్ని మాటువేసి తరిమి
అంధకారంలో ఉన్న ప్రజలకు
అందజేసి కాంతి చేయి, శాంతికి బోణీ
అందాల విరిబోణీ.

# స్త్రీ పర్వం

— గులాంనబి

ఒక స్త్రీ నా కన్నతల్లి
ఒక స్త్రీ నే గన్న తల్లి
ఒక స్త్రీ నా చిన్నిచెల్లి
ఒకే స్త్రీ నా ప్రేమవల్లి

తల్లి పాదప్రమాణం।
బిడ్డ బహిః ప్రాణపదం॥
చెల్లి – చెలిమి నిదర్శనం॥।
భార్య ప్రేమ ప్రతి రూపం

ఎందుకో? నను గన్న తల్లి
నన్నూ, నా చెల్లెళ్ళ వలె
నా భార్యను చూడలేదు:
అందుకో.... మరి ఎందుకో?
నన్ను నమ్మేడి ప్రాణ సఖియే
మా అమ్మను 'అమ్మ'న లేదు.

పురుషుల నిందించే ముందు
వనితల మందలించుమందు
ఇంట గెలిచి – రచ్చ గెలుచు
'ఇజం'లోనే ఉంది 'నిజం'।
ఋజువు చేసి చూపు 'శుక్ల'
తరతరాల చేదు నిజం॥

# చేదు నిజాలు

— పల్లేరు వీరస్వామి

చెలి బిగి కౌగిళ్ళ నే కాదు
చెలరేగడంతోను అగుతుంది — చలి

జాతీయ పతాకాల నెగరేయడమే కాదు
జాతి ప్రజల కష్టాల నెదుర్కోవడమే — దేశభక్తి

హింసించే కంసుల్ని
హతం చేయడం — అహింస

రాగాలు తీస్తే పుట్టదు
రాపిడి చేస్తేనే వస్తుంది — ఉష్ణం

వ్యర్ధ ప్రలాపాలతో వినవు
మర్ధన చేస్తేనే వింటాయి — పిచ్చి కుక్కలు

విలపిస్తే తీరదు
విప్లవిస్తే తీరుతుంది — కసి

కొందరు బ్రతకడమే కాదు
అందరూ సమంగా బ్రతకడమే — స్వాతంత్ర్యం

## 'మరోసారి కోరుకో'

— "ఉషాకిరణ్

యీ జీవుడు యీ జగతిపై
ఇతరులను అనందిప చేస్తు
తనువు చాలించే రోజున
మరుభూమిలో కలుస్తున్నాడు
గతించిన కాలములో
తను ఎవరో తెలియదు
యీ జీవితములో
అందరికి తెల్సు
తన కోసము, తన వారి కోసము
కీర్తి కాంతా కనకములకు
రోజూ పోరాటం
తనువు రాలిపోతున్న
రోజున తెలుస్తుంది విలువ ఏమిటో.
యీ లోకములో
నీ జీవిత తెర అంతమైంది....
మరో జన్మంటు ఉంటే
మరో పాత్రను జీవిత రంగములో
మరోసారి కోరుకో
ఈ జన్మలోని పొరపాట్లను సరిదిద్దుకోటానికి....

# తేడా

— వరిగొండ కాంతారావు

శునకం కూర్చున్నదని
సింహాసనం బంగారుని
శంకించడం అవివేకం.

కూర్చున్నది కుక్కేనని
నిర్ధారించుకు
తరిమికొట్టడం
వివేకం.

LIC రామాయంపేట, మెదక్ – 502 101

# వృథా

— జయశ్రీ

జీతం లేని కొలువు
మబ్బులు కమ్మిన ఆకాశం....
చంద్రుడు లేని నిశిరాత్రి....
దేవుడు లేని గుడి....
గురువు లేని బడి
చుక్కాని లేని నావ....
వెలుతురు లేని దోవ....
వెన్ను తట్టి నడిపే స్త్రీ మూర్తి....
తన్నంటి లేకుంటే....
జీవితమంతా వృథా.

# ప్రగతి పథంలో పయనం

— ధప్పూరి శ్రీధరాచార్య

స్వేచ్ఛామానవుడా
అడుగు నిలుపక
సాగిపో-సాగిపో
ప్రగతి పథానా॥ ॥స్వేచ్ఛ॥
మత మౌఢ్యం వీడు
కుల జాడ్యం వదులుకో
జనులంతా నీవారనె
భావనతో సాగిపో ॥స్వేచ్ఛ॥

కష్టసుఖాలు కలకాలంవుండవు
కలిమిలేములు కావడి కుండలు
అందరితో కలిసి మెలిసి
సాగిపో ప్రగతి పథానా॥ ॥స్వేచ్ఛ॥

అలసత్వం వీడు
స్వార్థమును మరచిపో
నీ వారే కాదు
పరవారిని నీ వారనే
భావనతో సాగిపో ॥స్వేచ్ఛ॥

మంచిర్యాల, అదిలాబాద్,

# స్మృతి రేఖలు

— వై. ఏ. మహేందర్ కుమార్

నీ జ్ఞాపకం నా చుట్టూ తిరుగుతున్నప్పుడు,
నక్షత్రాలు నింగి నుండి దిగి నా సితారు మీద వాలి,
నేను మీటిన రాగాలవుతాయి
సంధ్యలలో కొండల మీద కూర్చుని నీ కన్నులలో నిలచిన
చైతన్య కాంతుల్ని చూస్తూ పరవశిస్తున్నప్పుడు,
నాలోని కదలికలే నేనాలపించే గీతాలవుతాయి
జారిపోతున్న కాలం సెలయేటి నీటిలా ఏ తీరమో చేరుకోని
దిగంతాలను పరీక్షిస్తుంటే,
నాలో భాష రగిలి కాలిన గేయమేదో తడిసిన రెక్కలార్చుకుంటూ
ఎగిరిపోతుంది.
తిరిగివచ్చే వసంతం తానవుతానంటూ,
నీడలు పడని ఇసుక తిన్నెల తీరంలో నీ కొరకు వేచి చూసిన
ప్రతీ క్షణం నాకొక ఆమనివేళ
ఆ వేళలో తిరిగి వచ్చిన నా గేయం, ఊపిరితో కోమలంగా ఒదిగి
నా ఆత్మ ఆలపించే రాగానికి పరిమళాలను అలుముతుంది
ఆ క్షణం ఈ జగతిన నిద్రలో ఒరిగిన మధుర స్వరాలన్నింటిని
మేల్కొలుపుతాను,
అవి మౌనంగా నిను తాకుతుంటే....
నీ నుదుటి మీద నాట్యం చేసే తుహిణరేణువులో
పరచుకొని ప్రతిబింబించే వెలుగు రేఖలుగా
నా గాయాల్ని, నా అశ్రువుల్ని, నా స్వప్నాల్ని
నీ నయనాల తళుకులీనే ఉషస్సు రేకులపై
చైత్రమాసపు చిత్తరువుగా.
నీలోని నిశ్శబ్ద కెరటాలపై నిదురించే
స్మృతి జ్యోతి రేఖలుగా మిగిలిపోతాను.

---

ఇం. నెం. 5-11-98/2, విద్యారణ్యపురి, వరంగల్-506009

## ఓ కవీ...!

– డి. వి. శేషాచార్యః

మధుర మహోజ్జ్వల మాలికలు
మహోత్తుంగ తరంగ వీచికలు
మనోహర భావ వాహికలు.
మహోన్నత స్ఫూర్తిదాయికలు.
నీ మేధా జనిత భావ వీచికలు.

నెం. 6-3-112/1, బ్రాహ్మణవాడ, వరంగల్లు-506011

# 'మార్పు'

— ఎం. వి. ప్రసన్న

తరతరాలుగా
వ్యాసుడి నుండి
వానమామలై వరకు
వీరేశలింగం నుండి
వరవరరావు వరకు
కవితలు
వ్రాస్తున్నాయి కలాలు
కలతలు
పెరిగిపోతున్నాయి సమాజంలో.
వరకట్న దురాచార యజ్ఞంలో
సమిధలుగా కాలిపోకుండా
వనితను
కాపాడలేక పోతున్నాయి
నిస్సార జీవితంలో
నూతన తేజం తేలేక పోతున్నాయి.
వనితా! రక్షించుకో
స్త్రీ జాతి
ఆత్మగౌరవాన్ని
నారీ జగత్తు
సుగంధ పరిమళాన్ని.

ఇం. నెం. 5-10-39/సి, కిషన్‌పుర, హన్మకొండ.

# 'శుక్ల'

— 'పల్లెసీను

విన్నారా....!
మీరు వినకున్నా
ఎవరు కాదన్నా
ఏడాదికొక కానుపులా
తెలుగుతల్లి కంటోంది
తెలిపైన బిడ్డని.
కన్నవేళ ఖచ్చితమైన
శుభాన్నిస్తుందని మరీ మరీ పిలిస్తే
........................?
మమతా సమతలెప్పుడూ
సవతుల్లా పోట్లాడ్డం మానేస్తే,
వాత్సల్యం వాక్శుద్ధీ
ఒకే మంచంలో నిద్రిస్తే
భక్తీ శక్తీ యిరువైపులా
భద్రంగా కాపలాకాస్తే,
'మంగళం' హారతి పళ్లెంతో వస్తానంది.
'కారుణ్యం' కర్పూరం వెలిగిస్తానంది'

# హింస

- పబ్బా శ్రీశైలం

నోరూరించే వింత, వింత వంటకాల
పసందైన విందుతో పీనులకు విందునిచ్చే
ఆహూతులందరు మెచ్చే మంగళ వాయిద్యాలతో
కనువిందు చేసే రంగు, రంగుల మంగళ తోరణాలతో
కనులు మిరుమిట్లుగొలిపే కాంతి కిరణాల తోరణాలలో
వేడుకగా కళ్యాణం జరిపిస్తే....
తను కోరిన కానుకలు, ముడుపుల కొరకు
ఆ పతీ రత్నం జీవితం చాలిస్తే
పతితోనే ప్రాణంతో ఉన్న సతిని కూడా పోపొమ్మంటుంది ఈ సంఘ
పవిత్రమైన ప్రేమకు, ప్రకృతికే ప్రతిరూపమైన
స్త్రీ మూర్తిని హింసించుట దేనికి?
ఈ ధరణి పైని ప్రతి భర్త బాధానివారిణి
సహనానికి మరో పేరు సహధర్మచారిణి
మనిషీ! మానుకో.... ఆమెను హింసించు ధోరణి

ఇం.నెం. 3-14-153, దుర్గాకాలానీ, హన్మకొండ

# యుగలక్షణం

— పోలోజు వెంకటాచారి.

నేటి విద్యాలయాలు
కుటిల రాజకీయ నిలయాలు
అందులో చదువుకునే విద్యార్థులు
రాజకీయ 'చెడ' రంగంలో
అమాయక పావులు
రాజకీయ నాయకత్వాలు,
కులతత్వాలు, ప్రాంతీయతత్వాలు
స్వార్థ పరత్వాలకు ప్రతిరూపాలు
రాజకీయ హోమాల్లో
సమిధలౌతున్న యువత
భరత మాత గుండెల్లో
రేపుతోంది కలత
దేశం నాకేమిచ్చిందనే నాదం
అంటుతున్నది గగనం
దేశం కోసం నేనేం చేస్తున్నాననే విషయం
అడుగంటుతోంది ప్రతిదినం
దౌర్జన్యం, దాష్టీకం
హింస స్వార్థ పరత్వం
పరిష్కారానికి చేయదు దోహదం
విజ్ఞతతో, విచక్షణతతో
వ్యవహరించడమే విజ్ఞాన దాయకం
"యుగలక్షణం"

ఇం. 2-40/డి/1, బోడుప్పల్, హైదాబాదు-500039

# నేటి యువతరం

— బి. రాములు

ఇది ఒక యువత ప్రయోగశాల
ఇప్పుడే వీడారు ఊహాలోకాల–గోల
వాస్తవిక –ప్రపంచపు అనుభూతులను దర్శించి,
ఆలపిస్తున్నారు శాంతి గీతాలు.
నిన్నటి దాక పుస్తకాల, మస్తకాల దూరి
విజ్ఞానపు వీధులలో విహరించి
తిమిరంతో సమరం జేసి
నేడు క్రాంతితో శాంతికి
పలుకు తున్నారు స్వాగత గీతాలు.
స్వార్థ పరులు గీచే
సరిహద్దు రేఖలను చెరిపి
హిమాలయాల్లో ఘనీభవించే
తుషారాన్ని కరిగించి....
పాడుతున్నారు చైతన్య గీతాలు
సమతా–మమతలు రంగరించి
ఎద ఎదలో అనురాగం చిలికించి
నవీన యుగాన నవకవితా గానాన్ని
వినిపిస్తున్నారు–ప్రగతి గీతాలు

ఇం. నెం. 5–43, సప్తగిరి కాలనీ, కరీంనగరం–505002

# ప్రగతి దర్శనం

– "ప్రసాజి"

దశాబ్ది పరుగైనా
శతాబ్ది పరుగైనా
ఏముంది....ఎగబోత తప్ప
ఉత్సవాలు జరుపుకోవడంలో తప్పులేదు
కాని అదే ఉన్నతని ఊరటపడితే....పొరపాటు
పరుగెత్తడాలు....ప్రసంగాలు....ప్రార్థనా గీతాలు
పనికిరావివేవి ప్రగతిపైపు పరుగెత్తడానికి
నిబద్ధత మనోసాంద్రంలో పుట్టుకురావాలి
అపుడు నువ్వేసే అడుగులు చాలు.
కాలాన్ని బంధించడం నేర్చుకుంటున్న
మనం, జరుగుతున్న వాస్తవాలను
ఊహలుగా ఎగర వేయడం మాని
ప్రతిఘటించడం నేర్వాలి
ప్రగతిని, అవిశ్రాంత
విధి నిర్వహణతో సాధించాలి
ఆ పరుగే చరిత్ర పుటల వరకు
చేరుకో గలుగుతుంది.

జి. ప్రభాకర్ స్వామి, ఇం.నెం. 5-8-39, లష్కర్ బజార్, హన్మకొండ

# నా ఆలోచన

— కుందారపు పద్మావతి

నాలోని వ్యథను వెల్లడించడానికి
విషయమేదని వీక్షించిన నాకు....
సమసమాజంలో అబల ఆక్రందనలు,
వరకట్నపు చావుకేకలువిని
నా కలం కల్లోలమై
నా కల చెదిరి పోయింది
సాగర సంధ్యా సమయంలో
సామవేదపు గానం
ఆలపించాలనుకుంటే....
వాయుగుండపు తుఫానులు
వరదముప్పుల అరిష్టాలు
నా ఆలోచనకు అడ్డుతెరలై
నా కంఠాన్ని కబళించి వేశాయి.

# మూగవోయిన వీణ

కె. వి. సంతోష్‌బాబు

కదలలేనంటున్నది కలం
కాగితం మీద పదాల బాటపైన
పదం కదిపితే చాలు
పళ్లేర్ల పృతి బంధకాలెన్నెన్నో
ముందుకు పోనీక అడ్డుగా నిలచినప్పుడు
స్వేచ్ఛ హరించుకు పోయి
వ్రాయడమే నేరంగా మారుతున్నప్పుడు
కవులై పుట్టిన కవితా పరవర్యు లెందరో
కైతలల్లిన నేరానికి ఖైదీలుగా మారినప్పుడు
రచన చేసిన పాపానికి మరణ శిక్షలు విధింపపడుతున్నప్పుడు
ఏదినేరం? ఏది పాపం? అని అడిగే హక్కే మృగ్యంగా మారినపుడు
మానవత్వం శిలువ లెక్కుతున్నపుడు
సమానత్వం విలువ తక్కువై పోతున్నప్పుడు
ఎందుకీ పదాల విన్యాసం?
అందుకే నా కలం తీసుకున్నది సన్యాసం
నిర్లప్తులైన ప్రపంచ మేధావుల్లోని
నిస్సబ్దత అంతరించేదాకా
భావస్వేచ్ఛతో కవులు నిలచేదాకా
చీకటి చట్టాలు తొలగి అరుణోదయమయ్యే దాకా
స్వేచ్ఛా శుక్ల కిరణాలు వెంటగొని
శుక్ల వత్సర శుభాంగన శుభాగమన మయ్యేదాకా
పదం కదుపనంటున్నదికలం, మూగపోయింది నా గళం

ఇం.నెం. 3–1–204, కెప్టెన్ విజయరఘునందన్ రోడ్, కరీంనగరం–2

# "సమైక్యతా నాదం"

– వర్ధమాను వెంకటయ్య

భరతమాత బిడ్డలమై భావిభారత పౌరులమై
మల్లెలమై, మందారాలమై
బంతులమై, చేమంతులమై
జన్మించితిమీ పుడమిపై
ఆత్మవంచనలేని జీవితమునకై
పాఠాలను బోధిస్తు క్రమశిక్షణతో
కర్తవ్యాన్ని సూచించిరి కొందరు
దేశరక్షణార్థమై పటాలమందు చేరిరింకొందరు
సకల జనుల సముద్ధరణకై
సాంకేతిక నిపుణులైరి మరికొందరు
న్యాయాన్యాయ నిర్ణయముకై
న్యాయవేత్తలైరి కొందరు
ప్రాణాలను కాపాడుటకై ప్రాణ భిక్ష పెట్టుటకై
వైద్య వృత్తి చేపట్టిరింకొందరు
అన్నమిచ్చు దేవుళ్ళుగా
కర్షకులైరి మరికొందరు
పరిపాలకులమంటు ఛోటా, బడా నాయకులైరికొందరు
ఈ దేశం నీదీ నాదీ కాదని, మనందరిదని
మన దేశాభ్యున్నతికై నడుం బిగించాలి
అందరం మన మందరం

ఇం. నెం. 7-6-70, కాపువాడ, హన్మకొండ-506011

# సమత బాలుడు

— వి. వీరాచారి

తూర్పంతా రక్తంతో ఎర్రబడింది
ఆకాశ కొంకొక్కానికి చీకట్లో సూర్యుణ్ణి
ఎవరో ఉరి తీసినట్లున్నారు
తమస్సును ఛేదిస్తూ ఎరుపు
ఎరుపులోంచి ప్రకృతిని, చైతన్య
దీప్తిని చేస్తూ ఉషస్సు
ఇంకా ఆవలిస్తున్న ఊళ్ళ నిదురను
సమత సౌదామిని తట్టి లేపుతుంది
బిగించిన వల్లని పిడికిళ్ళలో
నిప్పు కణికలు జ్వలిస్తున్నాయి
ఎండమావి భ్రమలు తెరలు తెరలుగా
తొలగిపోతున్నాయి
వర్ణవివక్షత విచ్ఛిత్తిలోంచి వర్గ
చైతన్య గళాలు పురుడుపోసుకుంటున్నాయి
సమత బాలుని బోసినవ్వులు
జగతినంతా నిండిపోతాయి.

రీసర్చ్ స్కాలర్ తెలుగు విభాగము, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు

# మరో జన్మకు...

- కుందారపు రాజమౌ

మనసు మందిరం చేసి
మమతను మానవతనుచేసి
మానవాళికి మహోపకారము చేసి
మరో జన్మకు జపమాచరించుము.
మతము ముసుగులో చరిత్ర వ్రాయకు
నరమేధ యజ్ఞము చేసి రాజ్యమేలకు
అమాయకులను బలిచేసి నూరేళ్ళు బ్రతకకు
నాగరికత పేరుతో బ్రతుకు నరకం చేయకు

# మరో ఇతిహాసం...

— అయిలయ్య

కనుబొమలు విల్లులా వంగితే చాలు
ఓ కన్నీటి బొట్టు గడ్డంపై నుండి కంపిస్తూ నిలుస్తుంది
నల్లని ఆకాశ భూమిలో
తెల్లని గులాబిలా చంద్రుడు విచ్చుకున్నాడు
ఆలోచనల్లో లోకం మరిచిపోయి
భావశూన్య నేత్రాలతో
హృదయ తంత్రులని మీటుతూ
విషాద భరితంగా క్షణాల మూటను మోస్తున్న
నీటి బుగ్గలా.... గతం వెళ్తూ వెళ్తూ దూరాన
అదృశ్యమౌతుంది.
ఆ శూన్యంలో....
పచ్చని చెట్లు ఎర్రని పాలు వొలుకుతాయి
ఆకాశం అరుణ చెరగును విప్పుతుంది
అప్పుడు
హోరెత్తిన సిద్ధాంతాలన్నీ
మూడు పూవులు, రెండే కాయలై
అంతమైందనుకున్న భారత యుద్ధం
అప్పుడే మళ్ళీ మొదలౌతుంది
ఈ క్షేత్రంలో మరో ఇతిహాసం........

ఇం. నెం. 18–56, శాంతినగర్, నర్సంపేట–506132

# క్రీత

— టి. శ్రీరంగస్వామి

విచ్చుకుంటున్న రెక్కలపై
పేను పరుగుల సవ్వడి

మొలుస్తున్న మొలకలపై
మహిషం పాదాల శబ్దం

హృదయంలో పరిమళిస్తున్న భావాలపై
విషం చిలకరిస్తున్న ధ్వని

నిరంతరం వెంటాడుతుంటే....

సన్నజాజి, సంపెంగ, చామంతి, గులాబీలు
అవమానాలను భరించలేక
ఆత్మాహుతినే శరణ్యం అంటున్న
కఠోర ఝంఝూమారుతం
నా హృదయం కుంచికమై జ్వలిస్తున్నది.

5-11-114/4, విద్యారణ్యపురి, వరంగల్లు-505009

# ఉదయ భానుడు

– శ్రీమతి కె. శిరీష

తూరుపు దిక్కున నా కోసం
ఎవరో ఎదురుచూస్తున్నారని
చెప్పింది కోయిల
ఎవరబ్బా అనుకున్నాను!
మరల అంది....
వేకువజామున కోడికూసినాక
రమ్మనమని చెప్పినాడంది
మ ధ్య లో
నీవంతపాటేమిటని.... దట్టించాను.
కోయిల స్వరంలోంచి
తూరుపు సంజలోని
ఉదయభానుడిని సంకేతించింది.

ఇం. నెం. 1-150, గోపాలపురం, భీమారం, వరంగల్లు-506015

# యు వ క

— శీలం రాజే

చెత్తకుండీలు దులిపి ముచ్చటగా అర్చీలు కట్టు
మంత్రి పుంగవు డాగమించు,
గడ్డి సీవు గరుస్తున్నా పచ్చ తోరణాలు గట్టు!
కూడు గుడ్డ లేకున్నా పదంగలిపి పాడి ఆడు!
జాతిని ముక్కచెక్కలుగా చేయు
కులం తెగులు సోకింది
మనలోనే మనపేరు!
మహోన్నత దేశంలో
మన ప్రాంతం! మన భాష!
మన మాత! మన భ్రాత!
సంకుచిత భావ విషముష్టి విత్తనాలు
ఊరూరా పంచి పెడుతూ ఉసిగొల్పుతున్నాయి
వంతపాటగాండ్రు
స్వరముగ్ధులు – సారాముగ్ధులుగా చేసి
సుద్దులు ముద్దుగా పలికి
సద్దులు మాయం చేయు స్వార్థులు!
సంటివాడా జాగరత! నీ చేత ఓటున్నది!

ఇం. నెం. 5-9-25 లష్కర్ బజార్, హన్మకొండ – 506001

"నీడనిచ్చు చెట్టువలె యీ స్నేహమనుచు
సాహితీ శ్రీలు" స్నేహంపు టూహలోన
సంగమించిన 'శ్రీలేఖ' సంస్థ నేడు
వాసిగాంచె వరంగల్లు పట్టణమున॥"

— "అద్దంకి" (కళింగపట్నం)

శ్రీలేఖ సాహితీనుత
ధీలాలిత సభల నీడ తేజము గనుడీ!
ప్రాలేయాచల శశ్వ
త్కాలిక సత్కీర్తితోడ కళలన్ మనుడీ:

— ఆశావాది (పుంగనూరు)

---

ముఖపత్ర అలంకరణ : శ్రీ ప్రసాద్